జాషువా రచన

# నాగార్జున సాగర్

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ
పౌరసంబంధ, సమాచార శాఖ
హైదరాబాదు



" ఓ నాగార్జున సమ్మున్ని ప్రవర ! "

1486-1



ఓ నాగార్జున సన్ముని ప్రవర!

నీ వుర్వీస్థలిం బాసి,

యెన్నో నూర్లబ్ధము లంతరించినవి,

ఆంధ్రోర్వీజా భవత్సత్కళోద్యానం

బిప్పుడు పూచికాచి సువిశా లాంధ్రంబు సృష్టించి,

మా కానందంబు ఘటించె,

పండినవి నీ యానాటి దీక్షావనుల్ ।



నాగార్జున సాగర్



ఉరవళ్ళుగన్ బరవళ్ళు ద్రొక్కుచు
ప్రగాఢోర్మిచ్ఛటా లాస్యసుందరియై,
చక్కని పిల్లకాల్వలు మహాంధ్రక్షోణికిన్
కోటి వత్సరముల్ శ్యామల సస్య భూషణములన్ సంధింప,
భాషా కవీశ్వర పూజావిధు లందుకొ
మ్మ లఘు కృష్ణావాహినీ మోహినీ।





పుడమిం బావన మాచరింప

కరుణాపూర్ణుండు శ్రీ శాక్యసింహుండు జన్మించె

నఖండభారతికి, దివ్యుల్ మెచ్చ,

లోకంబులో నడిగెగా హింస

అహింస మేల్కొనె శుభంబొప్పారె

స్వాతంత్ర్య భానుడు క్రొన్నవ్వుల నుద్భవించె

సుఖకాంతుల్ నిండె దేశంబునకా





ఘన నాగార్జున సాగరంబు వెలసెఁ
గంగమ్మ కాల్వాచి,
యెండిన క్షేత్రంబుల నిద్ర మేల్కొలిపె
పండించెఁ సువర్ణంబు,
చక్కని ప్రాజెక్టులు నిక్కె.
దేశము సుభిక్షంబై ప్రకాశించె,
బుద్ధుని శిష్యావళి పాద పద్మముల యందుం
బుణ్య మెంతున్నదో ।





కళిమతళా విచ్చిన

వేయి రేకుల దళత్కంజాత

మాంధ్ర ప్రదేశము నం

దిప్పటి పల్లెనాటి ప్రజ లైశ్వర్యంబు వీక్షించి

ఘంటము చేపట్టుము

నైషధ ప్రముఖ నానా కావ్య నిర్మాతృ చంద్రమ।

శ్రీనాథ మహాకవీ ।

దొరక వన్నా నీకు జొన్నన్నముల్





అంగడి యూరలేమ,

వరియన్నము లేదు

శుచిత్వమేమిలే

దంగన లింపు లేరనుచు నప్పుడు వల్కితి

విప్పుడందువా

అంగన లంద రిందు దమయంతులుగా

వరియన్న మంతయుం బంగరు బువ్వగా బలికి

వ్రాయవె నైషధ కావ్యముల్ కవీ!





కలనాదంబున

నందికొండ శిఖరాగ్రం బెక్కి

కృష్ణాపగా జల ముప్పొంగి

తెలుంగు భూముల కభీష్టంబుల్ ప్రసాదించెడిన్

పలుకుల్ నేర్చితి నంచు దిట్టితివి

మా పల్నాటి గడ్డన్

భళాభళి ! నీ నవ్విన నాపచే నిపుడు

జాశ్వాపంటలం బండెడిన్



నాగార్జున సాగర్



అదిచల్లారని జ్యోతి,

ప్రోజ్జ్వలిత మాయా మానినీ గర్భసంపద,

సిద్ధార్థ మహావతార మిట

నావాసంబు గావించుకొన్నది

పెక్కేఁడుల నాటి నిద్రిత మహా నాగార్జునాచార్యు

నభ్యుదయశ్రీ వెలిగ్రక్కుఁచున్,

నవయుగంబున్ ధన్యమున్ జేయుచున్





మణిభూషల్, మణిసౌధముల్ విడిచి,

సామ్రాజ్యంబు బోనాడి,

దారుణ సన్యాసము స్వీకరించిన

నరేంద్రుం డీ నగం బందు,

ప్రత్యణు మధ్యంబున గోచరించెడిని,

బ్రహ్మాండం బహింసా పరాయణమై

పాదము లాశ్రయించె

నిది పుణ్యక్షేత్ర మాంధ్రాళికిన్





నీరవమైన యగ్గిరి వనీ వనఘూముల నుండి

దివ్య శంఖారవ మొండు

స్తూప శిఖరాగ్రముల న్నినదించు చుండు.

సంసారదవాగ్ని తప్తులకు

శాంతి ఘటించుచు

నిద్రపోవుచున్నా రనరాదు

భిక్షువులు నాడును నేడును బౌద్ధబోధకుల్





1436-3



నాగార్జునాచార్య నయనద్వయము నుండి,
జన్మించె సౌభాగ్య సాగరంబు
బ్రహ్మనాయని చిత్త పద్మంబు వికసింప
నుదయించె హరిజనా భ్యుదయసంధ్య
వర్ష పంచకరత్న పథక కల్పక మందు
చిగురించె నగర సంక్షేమశాఖ
ఆంధ్ర ప్రదేశంబు నాశ్లేష మొనరింప
నేతెంచె రసవాణి కృష్ణవేణి
అక్షరాక్షర మధురస స్యందు లగుచు
కూయుచున్నవి సుకవితా కోకిలములు
తెలుగు గద్దె ప్రజాభీష్టములు ఘటించి,
ప్రబలు గావుత మయుత సంవత్సరములు



పథ్నాలుగు



ముంబా పురీ రాష్ట్రమున పశ్చిమంబుగా
పాయకట్టున సముద్భవము నంది
ఉపనదీ సఖులు చేయూత నీయగ సాగి
కడలి రాయని మీద కన్నువేసి
అడుగు వారలకు లేదనక దాహముదీర్చి
కరువు కాటకముల కాలరాచి
పదియు రెండేండ్ల యౌవనము జారగనీక
పుష్కరంబుల నిత్య పూజ లంది
ప్రతిఫలాపేక్ష లేక భూప్రజల కెల్ల
తీర్థదానంబు చేయు నదీ మతల్లి
కడగి నాగార్జునాఖ్య సాగర సమాఖ్య
నవతరించితె కృష్ణా మహాస్రవంతి !





అన్నమో రామచంద్రా యంచు నల్లాడి
　　పరదేశముల కేగి బ్రదుకువారు
యకర మొక్కటికి మానిక గింజ రాలక
　　హరిహరీ యని యంగలార్చు వారు
పన్నుగట్టుట కిండ్లు వాకిళ్ళ తెగనమ్మి
　　మైమీది బట్టతో మసలువారు
సుంకువట్టిన కంకి సురిగి వర్షము లేక
　　యెండిపోవగ జూచి యేడ్చువారు
నీకు దాపున నున్నారు నిశ్చయముగ
నిన్ను కన్నార వీక్షించి విబ్బరించి
సంతసించిరి నీకు నిచ్చలును పూజ
జరుగు నాగార్జునాచార్య సాగరంబ!





తడుపుచున్నారు క్షేత్రములు కర్షకకోటి
మానక మేని చెమ్మటలు గురిసి

కట్టుచున్నారు సర్కారు వారికి శిస్తు
లెట్టులో తలలు తాకట్టువెట్టి

కడుపార మేత చిక్కక శుష్కితాంగమై
బ్రదుకు చున్నది మాదు పశుగణంబు

త్రవ్వుచున్నారు పాతాళ కూప శ్రేణి
యేటేట బుంగెడు నీటికొరకు

పాదమూని సిరులు పండించి కష్టముల్
చెండివేయ నిందు చేరినావు
పల్లనాటి సీమ ప్రఖ్యాతి గలదమ్మ
శ్రీ గలట్టి దొడ్డ సాగరంబ !





పండించు కొందు మిర్వది లక్షలకు మించి
క్షేత్రరాజముల నీ చెమ్మసోక

ఆకొన్న పేద తాలూకాల దుర్దశల్
తొలగిపోగలవు నీ చెలిమి సోక

కరుణ కొంచెము లేని కరువు బెబ్బులిపండ్లు
రాలిపోగలవు నీ రాకచేత

ఆశోపహతి తప్తమైన దీనుల చింత
మాసిపోగలదు నీ మైత్రి కతన

యెన్ని తరముల నుండియో యెదురుచూచి
నిలుపుకొన్నాము నిన్ను సాన్నిధ్యమందు
దిగులువాసెను మా కష్ట దినము లెల్ల
చనియె నాగార్జునాచార్య సాగరంబ !



## నాగార్జున సాగర్



సరవి న్మన్ను పునాది వైచి చనియెన్

జాతి ప్రభుండైన జహ్వారు మంత్రీశుడు

పంచవర్షములు మూడైపోయె

నింకైదు వత్సరముల్ పూర్తిగ నిండులోపల

మదాంధ్రక్షోణి ఆశించు బంగరుపంటల్ ఫలియించు

నీ నగము ప్రక్కన్ బుద్ధశిష్యాగ్రణీ



జాషువా రచన



మూడై దేండ్ల ప్రణాళికల్ ముగిసి

నీ పుణ్యాన దేశంబు డొక్కాడెన్

బెక్కాభివృద్ధి సంస్థలును యంత్రాగారముల్ నిక్కి

మేల్గాడింగ్బడ్డది జాతి జీవనము,

సంగ్రామంబులో నిల్చి పోరాడం గల్గు

జవాను శిక్షలకు విద్యాశాల లేపారెడిన్



## నాగార్జున సాగర్



పరదేశాలకు చేయిసాచక
యలభ్యంబైన యంత్రాళి సత్వర మిచ్చోట
తయారు చేసికొను సంస్థారాజముల్ కూర్చ
యెందరికో జీవనముల్
చరిత్రనొక యధ్యాయంబు
బంగారు టక్షర శోభన్ వెలుగొందు
నిక్కముగ వక్కాణింప నాగార్జునా !





స్థాపించినావు విద్యాలయం అచ్చటి
నందికొండల యరణ్యముల యందు
కట్టించితివి పెక్కు కట్టడంబులు విహా
రములు చైత్యములు స్తూపముల గములు
చేర్పించితివి తక్షశిల నలంవాల వి
ద్యార్థుల విశ్వవిద్యాలయముల
కరపినాడవు భిషగ్వరుల కాయుర్వేద
విద్యా రహస్యముల్ వివిధ గతుల
యేండ్లు పూండ్లును కడచి పోయినవి గాని
మాసిపోలేదు నీ యశోమహిమ నేడు
నీవు పాదంబు మెట్టిన నేల యందె
కడకు జన్మించె గొప్ప సాగరము బుగ్గ



నాగార్జున సాగర్



పులులుం బందులు రేచు లేలు
వన భూముల్ నేడు యద్దాల మేడలతో,
నిద్దపు రాజ మార్గముల తోడన్నిండి
విద్యుల్లతా నిలయశ్రేణుల నేత్రపర్వముగ
ఆంధ్రీదేవతా మస్తకోజ్వల రత్నాభరణంబుగా వెలసె
స్వేచ్ఛా రాజ్య చిహ్నంబుగా





పొదుపు జేసి కొనుట కుదయించినవి పెక్కు

సహకరించు బ్యాంకు లహరహంబు

విద్య నేర్పు బడులు, వేసవే ల్తలసూపె

ఊర నూర పెద్ద వారి కొఱకు



ఇరవై రెండు :

నాగార్జున సాగర్



ఘన శైలంబును ప్రక్కలించిరి

సౌరంగం బొందు నిర్మించి

ఝర్ఝన శబ్దంబున కృష్ణనీ రుచికి

ఆనందంబు గల్పించు,

వర్ణనకు నిర్మించిన మానవోత్తముని విజ్ఞానంబు

కీర్తించు చుండును నోరుండని కొండలు

న్మనసు పండు న్నిల్చి వీక్షించినన్





తలపరు తెల్లవారు భరతక్షితి కభ్యుదయంబు

వారి కత్తుల ఝళిపింపుచే బెదరి

దుర్దశ పాలయి యున్న జాతిలో

చలనము నించి పౌరుషరుషల్

దరికొల్పిన శాంతిదూత

నీ జలములు గ్రోలి దీవెనలు సల్పగ

లేదుగదమ్మ సాగరా !



నాగార్జున సాగర్



కల దింజనీర్ల ప్రతిభకు

వలసిన పని చేతినిండ ప్రాజెక్టులలో

జల విద్యుద్యంత్రాలయ

ములలో నవ్యతన సౌధముల నిర్మితిలో





లోపములెత్తిచూపు
పెనులోభుల మాటల కేమిగాని
దేశోపకృతుల్ సహస్రము సముద్భవ మైనవి
క్రొత్తక్రొత్తదీ కాపుర
మిర్వదేండ్ల యధికారము నందు స్వరాజ్య గేహ
మీ రూపు వహించె
తీర వొకరోజున కోరిక లాంధ్ర సోదరా!



నాగార్జున సాగర్



నీవొక సాగరంబవయి నిల్చితి

గంగమతల్లి వార్ధికిన్ సేవలు చేయు బాధ ముగిసెన్

ఘనమైనది దేశసేవ

నీ పావనమైన తోయము లవంబు లభించిన

లక్షభూములే కా వొకలక్ష జిహ్వలు

సుఖింపదు పుణ్యము నీకు దక్కెడిన్





విన్నిట నిల్పి నీ మధుర నీరము గ్రోలు

ప్రజాళికెల్ల యింతన్నము బెట్టినా

వయిదు నారగు వర్షము

లింకముందు రానున్న తరాలవారికి సహోదరివై

కడుపార విష్ట మృష్టాన్నము బెట్టుమమ్మ

సుఖమబ్బును రాష్ట్ర ప్రజాళికంతకున్



ము:ప్రై.



జవహరువోయె,

శాస్త్రి దివిషత్సభ కేగె,

మహాత్ము డెప్పుడో యవని త్యజించె

జవ్హారుని యాత్మజ దండము చేతబట్టె

మార్దవమతి కోమలంబగు హృదబ్జము గల్గిన యిందిరమ్మ

హైందవ ధరణీ శుభోన్నతికి

తప్పక తోడ్పడు దేశ సోదరా!



"2 వేల సంవత్స
రాల క్రితం ఆచార్య
నాగార్జునుడు ప్రచా
రించిన విజ్ఞాన
[illegible]లో నేడు నా
గార్జునసాగర్ క్రొత్త
జీవనాన్ని ప్రసా
దిస్తున్నది"



ప్రధాని

శ్రీమతి ఇందిరా గాంధి